    

శ్రీరస్తు-

శ్రీమతేరామానుజాయనమః

# ఆశౌచసర్వస్వము.

ఇది

విజయనగరనివాసులైన

శ్రీ పింజమూరి వేంకటనృసింహాచార్యులు

అయ్యవారలుగారిచే రచియింపబడి

వారిశిష్యులును [illegible]సంస్థాన[illegible]గును

మహారాజశ్రీ శ్రీ రాజా చెలికాని అప్పారావుబహద్దరువారి

ధర్మపత్నిగారును నగు

శ్రీ రాజా చెలికాని వెంకయ్యమ్మ బహద్దరుగారి

సహాయము చేతను

వారిజామాతగారును [illegible]పేట బి. ఎ. [illegible]ప్రభువులునగు

మహారాజశ్రీ శ్రీ రాజా వామెంట వేంకట సీతారా

మయ్యబహద్దరుగారిసహాయము చేతనను

ముద్రాపితమై ప్రకటింపబడినది-

1917

Printed & Published by
D. Sanyasi for the Proprietor,
at the Arsha Press.
Vizagapatam.

శ్రీభగవత్సాహాయ్యశ్చస్తు.
శ్రీమతేహయగ్రీవాయ నమః
శ్రీమతే రామానుజాయ నమః.

# భూమిక.

శ్రీమన్నారాయణసృష్టంబులగు లోకంబులలో భూలోకంబు కర్మాచరణోపయోగిలోకంబనియు నితరలోకంబులు కర్మఫలానుభవోపయోగిలోకంబులనియును బ్రసిద్ధమేకదా. అట్టిభూలోకంబున నీభరతఖండము శ్రుతిస్మృత్యాదిచోదితకర్మభూమిష్ఠంబైయున్నదను సంశమందరికిని విశదమయియేయున్నది. అట్టినిత్యనైమిత్తికాదికర్మాచరణము స్వసంవృతు జాతాశౌచాదులచే బ్రతిబంధింపబడుచున్నది. కావున నట్టియాశౌచస్వరూపమును దత్పరిమితినిగూడ దెలిసికొనుట యత్యావశ్యకమై యున్నది. కానియది యనేకస్మృతులలో ననేకప్రకారములుగ నిర్ణయింపబడియుండుట వలన మందబుద్ధులగు నిప్పటిమనుష్యులు దానిని దెలిసికొనుట సులభము కాదని యోచించి పరమకృపాపరిపూర్ణులును హారీతగోత్రసంజాతులును వైదికసార్వభౌమబిరుదాంచితులును సరస్వతీవల్లభాపరనామధేయవిశిష్టులును విశిష్టాద్వైతమతాలంకారభూతులును శ్రీరంగనాథాచార్యపుత్రులు నగు శ్రీవేంకటనాథాచార్యులవారు దత్స్వరూపపరిమిత్యాదులను సులభముగా దెలుపగోరి ద్రావిడబ్రాహ్మణవైష్ణవుల యుపయోగముకొరకు(అనగా నీగ్రంథమందు చెప్పబడిన ప్రకారము ద్రావిడబ్రాహ్మణవైష్ణవులుమాత్రమే జాతాశౌచాదులను పట్టవలయుననుట)ఆశౌచశతకమనుశ్లోకరూపనిర్ణయగ్రంథమును రచించి దానికితరులు వ్యాఖ్యానమును

రచించినచో తమమనోగతార్థములు రాక నితరార్థము
లువచ్చునని సంశయించి తామే వ్యాఖ్యానమును గూడ
రచియించిరి.

దానినిగూడ జదివి తెలిసికొనుట కష్టమని యోచించి ఇ
టీవల శ్రీభరద్వాజకుల తిలకానంతదీక్షితపుత్రుడగు. రామచం
ద్రాధ్వరియను మహాశయుడాగ్రంథముయొక్క ముఖ్యాం
శములను గ్రోడీకరించి యఘవివేచనమను వాక్యగ్రంథమును
రచియించెను. ఆయఘవివేచనము 1884 వ సంవత్సరమునం
దు మైసూరులోను 1891-వ సంవత్సరమందు బ్రహ్మశ్రీ
పావిళ్ల రామస్వామిశాస్త్రిగారిచే చెన్నపురియందును ము
ద్రింపబడెను. మైసూరుప్రతికిని చెన్నపట్టణప్రతికిని ప్రకర
ణనిర్ణయమందును మరికొన్ని యంశములందును కొంచెము
భేదములున్నవి. చెన్నపురిప్రతిలో గొన్ని విశేషములున్నవి.

1898-వ సంవత్సరములో విశాఖపట్టణములో బ్రహ్మశ్రీ
చేవలిసుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే నాంధ్రద్రావిడులకు
పయోగించునటుల షడశీతి నిబద్ధియు నాశౌచశతకమును బట్టి
యు నాశౌచసారమను నొకగ్రంథమాంధ్రగీర్వాణభాష
లలో వ్రాయబడినది. అదిబహుపక్షగనే వ్రాయబడినది
గాని యాశౌచశతకార్థవిస్తారములలో గొంచెము వ్య
త్యాసములుపడినవి పిమ్మట 1906-వ సంవత్సరమున బ్రహ్మశ్రీ
దూర్వాసుల యజ్ఞేశ్వరశాస్త్రిగా రాశౌచస్మృతిసంగ్రహ
మను నామముతో ఆశౌచవిధాయకస్మృతులనుదాహరించి
యు వానియర్థములను తెనుగున వ్రాయుచు నొకగ్రం
థమును రచియించిరి. దానియందు రజస్వలాశౌచాదులు

నిర్ణయింపబడలేదు- ద్రావిడపద్ధా శౌచములును నిర్ణయింప
బడలేదు

కావున ప్రాచీనమగు నఘవివేచనము నాంధ్రీకరించిన
చో సంస్కృతము తెలియనివారికి చాలనుపయోగముగనుం
డునని తలంచి యాపనిం జేసితిని- ఇందు మైసూరుప్రతిలో
ని యంశములును చెన్నపురిప్రతిలోని యంశములును గూడ
జేర్చబడినవి- ఇదియును గాక నాశౌచశతకస్థములగు క్ష
త్రియవైశ్యశూద్రాద్యాశౌచవిధులు కూడ వ్రాయబడినవి-
ఇంతియగాక నాంధ్రబ్రాహ్మణుల యాశౌచపరిమిత్యాదు
లు భేదించినవిషయముల యొద్ద సంకేతమునిమిత్తము-౧-
-౨-మొదలగు నంకెలను వైచి పుటయొక్క దిగువ గీయబడిన
గీతక్రింద సంకేతప్రోక్తసకారకాయంకెలనే వైచి యాభేద
ములను వివరించితిని- కనుక నీగ్రంథమాంధ్రబ్రాహ్మణులకు
గూడ నుపయోగించును. క్షత్రియాదులకు గూడ నుపకరించు
ను. కావుననే దీనికి ఆశౌచసర్వస్వమను పేరిడబడినది-
ప్రస్తుతమాచరణములో లేని యాచారములను గూడ పైని
వ్రాయబడిన ప్రకారముగనే యంకెలవైచి దిగువగీయబడి
నగీతక్రింద వివరించితిని. దీనికి మూలగ్రంథమగు సంస్కృ
తాఘవివేచనములో నామనిర్దేశము మాత్రము చేయబడి
యర్థనిర్ధారణము చేయబడని మహాగుర్వాదిశబ్దముల
యొక్క యర్థనిర్వచనమాయఘవివేచనమునకు మూలగ్రం
థమగు నాశౌచశతకములో జెప్పబడిన ప్రకారము చేయం
బడియె- సంస్కృత ఘవివేచనములో జాతాశౌచమృతా
శౌచాదులు సంకీర్ణముగానుండుటచే నట్లుండుట బుభుత్సు

జనసుజ్ఞేయంబుగాదని యోచించి వాటికి ప్రకరణముల నేర్పఱచి చదువరులకు స్పష్టము చేసితిని. పండితపామర సాధారణముగ దెలియుటకొరకీ గ్రంథమునందు సంధులు అర్ధబిందువులు మొదలుగాగల వ్యాకరణనియమములంతగా పాటింపబడలేదు. కావున విద్వాంసులందరు దీని నాదరించి ప్రకరణనిర్ణయాదులచే నాపాతప్రతీతముగ జూచినతోడనే క్రొత్తదివలె కాన్పించు దీనిని సంస్కృతాఘవివేచనమునకు సరియగు భాషాంతరీకరణము కాదని యోచింపక సాకల్యముగ పరికించి గుణములనే గ్రహించి దోషముల నుపేక్షించి నన్ను మన్నించుటకు ప్రార్థితులు. ఇంతియగాక సంస్కృతాఘవివేచనమునకును దీనికిని యర్థభేదములుండెనేని వానిని నాకు దెలిపినచో నింకొకకూర్పులో సవరించెదను. కనుక నేతద్గ్రంథాంధ్రీకరణమునకువలయు జ్ఞానాదులు లేని నాయొక్క యేతద్రచనారూపసాహసకృత్యమును క్షమించుటకు విద్వద్వరులను వేడుకొనుచున్నాడను. మరియు నేతద్గ్రంథప్రకరణనిర్ణయాదులలో నాకుచాల సాహాయ్యమొనరించిన మహామహోపాధ్యాయ శ్రీమత్పరవస్తు వేంకటరంగాచార్యార్యవరగురుపౌత్రులును శ్రీమచ్ఛ్రీనివాసజగన్నాథస్వామిగురువరపుత్రులునునగు శ్రీమల్లక్ష్మీనరసింహస్వామిగారికి కృతజ్ఞతాపూర్వకానేక వందనముల జేయుచున్నాను.

ఇట్లు విన్నవించు
విద్వద్విధేయుడు.
వింజమూరి వేంకటనృసింహాచార్యుడు.

# విషయసూచిక.



శ్రీరస్తు.

శ్రీభగవత్సాహాయ్యమస్తు.

శ్రీమతే హయగ్రీవాయనమః.

శ్రీమతే రామానుజాయనమః.

# ఆశౌచసర్వస్వము.

కం॥ శ్రీమానినీమనోహరు।
సేమముసమకూర్పమదిని సేవింతునునా।
పామరతనాతడెంచక।
కామితములనెల్ల నాకుకరుణనొసంగు॥

తే॥గీ॥ చాలధర్మశాస్త్రంబుల జదువఁ జేసి।
సంగ్రహములన్నిటినిగూడ జదివిచూచి।
సుఖముగా బోధపడుటకై సులభవాక్య।
రాశిచే నఘవివేచన రచన జేతు॥

## మొదటి ప్రకరణము.

### సంజ్ఞాపదములు.

నిత్యనైమిత్తికాది కర్మాచరణమునకు ప్రతిబంధకమైన యశుచిత్వమే యాశౌచమనబడును.

ఈ ఆశౌచము రజస్వలాశౌచమనియు, స్రావాశౌచమనియు, జాతాశౌచమనియు, మృతాశౌచమనియు, అతిక్రాంతాశౌచమనియు, సన్నిపాతాశౌచమనియు, నారు విధములై యుండును.

ఇందు రజస్వలాశౌచమనగా స్త్రీలకు రజోదర్శనమగుటవలన కలిగిన యశుచిత్వము. దీనినే ముట్టని యందురు.

స్రావాశౌచమనగా గర్భస్రావమువలన గలిగెడి యశుచిత్వము. ఏడవమాసము ప్రవేశించినపిమ్మట గలిగెడి గర్భపాతము ప్రసవముతో సమము.

జాతాశౌచమనగా పుట్టుకవలనకలుగు నాశౌచము. దీనినే పురుడందురు.

మృతాశౌచమనగా చావువలనకలుగు నాశౌచము. దీనినే మైల యందురు.

అతిక్రాంతాశౌచమనగా దాటపోయిన పురుడుగాని మైలగాని అయియున్నది.

సన్నిపాతాశౌచమనగా నొకేసమయమందు రెండుగాని అంతకంటె యెచ్చుసంఖ్యగలవిగాని యాశౌచములు వచ్చుట.

ఈ ఆశౌచమే దానిని వహించువారినిబట్టి సపిండాశౌచమనియును, సమానోదకాశౌచమనియును, సగోత్రాశౌచమనియును, అసగోత్రాశౌచమనియును, అసగోత్రవిశేషాశౌచమనియును, తిరుగ నైదువిధములుగ నుండును.

ఇందు సపిండాశౌచమనగా సపిండులు పట్టవలసినయాశౌచమనుట. సపిండులనగా పురుషవిషయమందు ఏడు పురుషాంతరములవరకును (అనగా కూటస్థుని మొదలు చేసి తననున్ను జననమునుగాని మరణమునుగాని పొందినవానినిన్ని లెక్కచూడగా నిద్దరును కూటస్థుడు మొదలేడుతరములు దాటనివారు) కావలెననుట. స్త్రీవిషయమందు సపిండత్వము మూడుపురుషాంతరములవరకుండును.

సమానోదకులు అనగా కూటస్థునియొద్దనుంచి లెక్కచెయ్యగా తనకును జననమునుగాని మరణమునుగాని పొందినవానికిని ఏడుపురుషాంతరములుదాటి పదునాలుగు పురుషాంతరములు దాటని జ్ఞాతులనుట.

సగోత్రులు అనగా కూటస్థునియొద్దనుంచి లెక్కచెయ్యగా తనకును జననమునుగాని మరణమునుగాని పొంది

నవానికిని పదునాలుగు పురుషాంతరములు దాటి యిరువది యొక్క పురుషాంతరములు దాటని జ్ఞాతులనుట.

అసగోత్రాశౌచమనగా తనగోత్రస్థులుకాని మేన మామ మొదలగువారు పట్టవలసిన యాశౌచమనుట.

అసగోత్రవిశేషాశౌచమనగా తనగోత్రజులునుగాక తనకు దేహబంధుత్వమును లేకయుండెడి ఆచార్యులు మొద లగువారు పట్టవలసిన యాశౌచమనుట.

ఈక్రిందను మరికొన్ని ముఖ్యములగు సాంకేతికపద ములయర్థములను వివరించుచున్నాను.

క్షేత్రజుడు అనగా తన భార్యయందింకొకనివలన పుట్టినవాడును ఇంకొకనిభార్యయందు తనవలన పుట్టినవా డును.

మహాగురువు అనగా ఎవడు యథాశాస్త్రముగా (అనగా "ఋతౌవుపేయాత్" ఇత్యాది శాస్త్రవిధులప్ర కారము) కొడుకునుపుట్టించి జాతకర్మాదిసంస్కారములచే సంస్కరించి అనగా నతిశయముకలవానినిగా జేసి నియ మానుసారముగ వేదమును చదివించి జీవనమును కలుగ జేయుచున్నాడో అతడు మహాగురువనిపించుకొనును.

సంస్కారము (లేక శావసంస్కారము) అనగా శవ మునకు జరిగింపవలసిన క్రియావిశేషములు. అవి ఖననమని

యును, దహనమనియును, త్యాగమనియును, మూడువిధ
ముల నుండును.

ఖననమనగా పాతిపెట్టుట.

దహనమనగా కాల్చుట. ఇది గాక అస్థిదహనమని
యు ప్రతికృతిదహనమనియు రెండు దహనవిశేషములు
న్నవి.

ఇందు అస్థిదహనమనగా మొదట శవదహనము స
మంత్రకముగాజరుగనియెడ నందలి ఎముకలను సంగ్రహించి
వాటిని పిమ్మట సమంత్రకముగ దహనము చేయుట.

ప్రతికృతిదహనమనగా మొదట సమంత్రకముగ శవ
దహనము జరుగనియెడ చనిపోయినవారి ప్రతికృతిని చేసి
దానిని దహించుట. ప్రతికృతియనగా మోదుగాకులచేత
చేయబడిన చనిపోయినవారి ప్రతిమ యనుట.

త్యాగమనగా పారవేయుట.

(౧) పక్షిణీయనగా దినద్వయపరిమితిగల మృతాశౌ
చము. దినద్వయమనగా ఒకరాత్రిమధ్యగల రెండుపగ
ళ్ళుగాని ఒకపగలు మధ్యగల రెండురాత్రులుగాని అయి
యున్నది.

(౧) పక్షిణీయనగా మూడుపినములుగూశౌచమనుకొనుట కేవ
లము పొరపాటును అశాస్త్రీయమును నయ్యున్నది.

ఏకకాలమనగా ఒకపూటయందు మృతాశౌచము-అనగా రాత్రియందు తెలియబడెనేని యారాత్రిమట్టుకును- పగటియందు తెలియబడెనేని యాపగటిమట్టుకును నుండు మృతాశౌచమనుట-

అరుణోదయమనగా మరునాటిసూర్యోదయమునకు మూడుగడియలు వ్యవధియుండు కాలము.

అనుమరణమనగా భర్తచనిపోవుటకుపూర్వదినమందుగాని భర్తచనిపోయిన తరువాతిదినమందుగాని భార్యచనిపోవుటయును తనభర్తకళేబరముతో కూడనగ్నిప్రవేశము చేసి చనిపోవుటయును భర్తచనిపోయినదినమునే కాలవశమున భార్యచనిపోవుటయును-

శ్రోత్రియుడనగా వేదాధ్యయనసంపన్నుడు-

ఆచార్యుడు అనగా "ఉపనీయ తు యశ్శిష్యం" అనునిది మొదలుగాగల మనువుచే చెప్పబడిన లక్షణములుగలవాడై ఉపనయనముచేసి వేదాద్యుపదేశములు చేసినవాడు-

శిష్యుడు అనగా తనచేనుపనయనము చేయబడి వేదాదులు చదివింపబడినవాడనుట-

ఋత్విజుడనగా అగ్నిష్టోమాదియజ్ఞములయందు య

జమానునిచేత కోరబడినవాడై అట్టియజ్ఞములను మంత్రోచ్చారణక్రియాదులచేత చేయించినవాడనుట.

యాజ్యుడనగా తనచేతనడిపింపబడిన యజ్ఞమునకుయజమానుడనుట. అనగా కర్త యనుట.

షండుడనగా నుచితకాలములయందు స్నానహోమదానపితృదేవతార్చనలను చేయనివాడును తనశిశ్నమును ఛేదించుకొనినవాడును.

పాషండుడనగా నెవ్వడజ్ఞానమువలన వేదమును తనయొక్క వర్ణాభిముఖ్యమును విడిచి హీనకర్మములయందుంచునో వాడు పాషండుడనబడును.

పతితుడనగా కులభ్రష్టుడు.

వృథాజాతుడనగా క్రియాగుణాదులచేత నొకప్రయోజనమునను సంపాదింపలేనివాడు.

సబ్రహ్మచారియనగా తనకుపనయనముచేసిన యాచార్యునిచేత నుపనయనము చేయబడి తనతోకూడ నధ్యయనము చేయబడిన వేదభాగముకలవాడనుట అనగా నొక యాచార్యునిచేత నుపనయనములు చేయబడి చదివింపబడిన వేదైకదేశముకలవారు పరస్పరము సబ్రహ్మచారులనబడుదురు

మొదటిప్రకరణము ముగిసెను.

---

## రెండవప్రకరణము.

## పరిష్కారములు.

రెండుసంధ్యలను అనగా నాశౌచశీతకమందు నిష్క్రమణ చేయబడినప్రికారము రెండుసంధ్యలకొరకును పదుగడియల ముప్పదివిగడియలను (అనగా రాత్రిమొదట మూడుగడియల నలువదియైదు విగడియలనును, కొసనుమూడుగడియల నలువదియైదు విగడియలనును) విడిచి ఆమధ్యనున్న మిగతరాత్రిని అప్పటిరాత్రి ప్రిమాణానుసారముగ మూడువంతులువేయగా నందులో మొదటి రెండువంతులలోనును స్త్రీలుముట్టగుట పుట్టుక చావు ఇవి సంభవించెనేని వీటిశుద్ధివిషయమై ఆదినమునుంచి యేలెక్కచూడవలయును. మూడవవంతు రాత్రిలో పైనచెప్పంబడిన ముట్టగుట మొదలగునవి సంభవించెనేని మరునాటినుండి యే లెక్కచూడవలయును.

చనిపోయినవిష్ణుట నేదినమందు ఖననాదికము చేయబడునో అనగా మరణదినముగాక మరియొకదినమందు ఖననాదికము చేయబడినయెడ నాదినమునుండి యారంభించియే మూడుదినములాశౌచమును నిర్ణయింపవలయును. ఈవిధి కన్యాబాలకుల విషయమే.

ఆహితాగ్నికానివానికి అనగా నిత్యాగ్నిహోత్రమును చేయనివానికి మరణదినమునుండి యారంభించియే దశాహాదివిధి.

ఆహితాగ్న్యైనవానికి దహనదినమునుండి యారంభించియే దశాహాదివిధి-

ఇద్దరికిని అనగా అహితాగ్న్యనాహితాగ్ను లిద్దరికిని సంచయన విషయమై అనగా బుగ్గి యెత్తిపోతవిషయమై దహనదినమునుండి యారంభించియే చతుర్థాదిదినముల లెక్క చేయవలయును-

ఆశౌచము రాకముందారంభింపబడిన కృచ్ఛ్రాదికర్మానుష్ఠానము ఆశౌచమధ్యమందు సమాప్తిని పొందింపబడిన యెడ నట్టి కర్మసమాప్తియైనపిమ్మట మిగిలియున్న దినములయందే మైలయుండునుగాని కర్మానుష్ఠాన దినములలో మైలయుండదు. ఆశౌచానంతరమందు సమాప్తిని పొందింపబడినయెడ నాయాశౌచము అతిక్రాంతాశౌచమగును- అనగా పదిదినములును దాటినపిమ్మట మూడుమాసములలోపల తెలియబడిన దశాహాశౌచము మూడుదినములే యుండును అనునది మొదలుగాగల విధులకు లోబడిన యాశౌచమై యుండుననుట-

భర్తృసంభవించిన యాశౌచములు అనగా పురుషును మైలయును భార్యకుగూడ నన్నివిషయములయందును సమానములు అనగా నేవిధముగాభర్తకు పురుషును మైలయును వచ్చి ఎన్నిదినములున్నను భార్యకుగూడ నాపురుషును మైలయా నన్నిదినములుండునని ఎరుంగునది- భార్యకుమాత్రమే రాతగినవైయట్లువచ్చినవి భర్తకురావు-

ఆశౌచముకలవారి సంపర్కము ఎవరైనను చేసినయెడ నెన్ని దినములు చేసిన నన్ని దినములే చేసినవారిమట్టుకే ఆ యాశౌచముండును.

వివాహముకాని యాడుపిల్ల జాతాశౌచ మృతాశౌచముల విషయములో సోదరులతో సమానురాలయ్యెన్నది.

పదిదినములపురిటిలో శిశువుచనిపోయెనేని ఖననమునే చేయవలయును.

పదిదినములు దాటినపిమ్మట పండ్లు మొలచులోపలగాని ఆరవమాసమునకు లోపలగాని చనిపోయెనేని ఖననమునుగాని దహనమునుగాని చేయవచ్చును.

పండ్లు మొలచుటకుగాని ఆరవమాసమునకుగాని పిమ్మటనున్ను మూడుసంవత్సరములకుగాని పుట్టువెండ్రుకలను తీయుటకుగాని ముందుగానున్న పిల్లలుచనిపోయిరేని ఖననమునుగాని దహనమునుగాని త్యాగమునుగాని జరిగించవచ్చును.

పుట్టువెండ్రుకలను తీసినపిమ్మటను మూడుసంవత్సరములుదాటినపిమ్మటను చనిపోయినపక్షమందు దహనమును చేయవలయును.

ఉపనయనమైనను కాకపోయిననుగూడ నేడవసంవ

త్సరముప్రవేశించినపిమ్మట చనిపోయెనేని దహనసంస్కారమునే చేయువలయును.

ఖననము దహనము మొదలగుసంస్కారములయొక్క వికల్పము (అనగా దీనినిగాని దానినిగాని చేయుట) వివాహముకాని చిన్నదానివిషయములే. వివాహమైన చిన్నదానికి చౌలముకంటెపూర్వము మరణముసంభవించినను దహనసంస్కారమే చేయబడదగినది.

రెండవప్రకరణము ముగిసెను.



## మూడవ ప్రకరణము.

## రజస్వలాశౌచము.

---

ఋతుమతియైన దినముమొదలు అనగా ముట్టైనదినముమొదలు స్త్రీలకు మూడుదినములాశౌచముండును.

(౧)ముట్టైనదినముమొదలు పండ్రెండుదినములలో తిరుగ ముట్టయ్యెనేని మూత్రవిసర్జనమందువలెనే ఉదకముతో కడుగుటవలననే శుద్ధియగును. పండ్రెండుదినములు దాటిన పిమ్మట ఆరుదినములలో నయ్యెనేని స్నానమువలనశుద్ధి. ఆటుపిమ్మట నయ్యెనేని మూడుదినములాశౌచముండును.

---

(౧) ముట్టైనదినముమొదలు పదునేడుదినములలో తిరుగ ముట్టయ్యెనేని స్నానమువలన శుద్ధియును పదునెనిమిదవ దినమున నయ్యెనేని యొకదినమాశౌచమును పందొమ్మిదవ దినమునయ్యెనేని రెండుదినములాశౌచమును అటుపిమ్మటనయ్యెనేని మూడుదినములాశౌచమును నుండుట యాంధ్రాచారములు.

మూడవప్రకరణము ముగిసెను.

---

# నాలవప్రకరణము.

## స్రావాశౌచము.

---

మూడుమాసములలోగ గర్భస్రావమైనయెడ నా స్రావముసంభవించినస్త్రీకి స్వాభావికముగ ప్రతిమాసమందును సంభవించు ఋతువునందువలెనే మూడుదినములే యాశౌచముండును. ఆమీద నాలుగవమాసమందయ్యోనేని నాలుగుదినములును ఐదవమాసమందయ్యోనేని యైదుదినం

నారదీయే.

శ్లో. రజస్వలా యదిస్నాతా, పునరేవ రజస్వలా।
అష్టాదశ దినాదర్వాగ్, గశుచిత్వం నవిద్యతే ॥౧॥
శ్లో. ఏకోనవింశతేరర్వాగ్, గేకాహంస్యాత్తదూర్ధ్వతః।
వింశత్యూర్ధ్వం రజఃకాలేతు, త్రిరాత్రమశుచిర్భవేత్ ॥౨॥

ఈశ్లోకములు 1911వ సంవత్సరమున చెన్నపురిలో, వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండు సన్సువారి ఆదిసరస్వతీనిలయ ముద్రాక్షరశాలయందుముద్రితమైన ముహూర్తదర్పణము 137వ పేజీలో నుదహరింపబడినవి.

(౨) ఏస్త్రీకైనను నాలుగవమాసమందలి యాస్రావము కలసనుగానయ్యోనేని ఆమెభర్తకు మూడుదినములాశౌచమును, జ్ఞాతులకును ఆమెయొక్క కొడుకులకును కూతులకును స్నానమువలనశుద్ధియును, పక్షాంతరమున అనగా మరియొకగ్రంథకర్తయొక్క మతమున మృదుస్రావము కఠినస్రావమునను భేదములేక భర్తకును జ్ఞాతులకునుగూడ మూడుదినములాశౌచమును ఆంధ్రాచారములు.

(3) ఆస్రావమే ఐదవ అరవమాసముల యందయ్యెనేని భర్తకును జ్ఞాతులకును గూడ స్నానమాత్రమువలననే శుద్ధియగును. ఆయైదారుమాసములయందే యాస్రావమే కఠినముగానయ్యెనేని అనగా పిండరూపముగా నయ్యెనేని భర్తకునుజ్ఞాతులకును గూడమూడుదినములాశౌచముండును.

ఏడవమాసము మొదలామీదను గర్భపాతమైనయెడ భర్తకును జ్ఞాతులకునుగూడ పదిదినములాశౌచముండును.

నాలవప్రకరణము ముగిసెను.

---

(3) ఆస్రావమే ఐదవ ఆరవమాసములయందు కఠినముగానైనను మృదువుగానైననుగూడ భర్తకును జ్ఞాతులకును మూడుదినములాశౌచముండుట యాంధ్రాచారము.

## ఏదవ ప్రకరణము.

### జాతాశౌచము.

---

(౧) మగశిశువును ప్రసవించిన స్త్రీ ముప్పదియొకటవ దినమునను ఆడుశిశువును ప్రసవించిన స్త్రీ నలువదియొకటవ దినమునను శుద్ధినొందును. అందు మొదటిపదిదినములును చూడఁబడదగకపోవుట వినఁబడగూడని మాటలు కలుగుట (అనగా నామొదటి పదిదినములలో నామెను చూడగూడదు ఆమెయొక్క మాటలను వినగూడదు అని తాత్పర్యము) మొదలగు నాశౌచము ను ఆపైని ముట్టుకొనబడదగకపోవుట కర్మార్హత లేకయుండుట అనునాశౌచమును ఆస్త్రీలు కలిగియుందురు.

ఏపురుషునకు సంతానము కలుగునో ఆపురుషుడు పురిటింటనుండుట మొదలగు సంపర్కము కలిగియుండెనేని అతనికిని ముట్టుకొనబడదగకపోవుట మొదలగునాశౌచము పదిదినములు నుండును.

మగపిల్లవాడుపుట్టినయెడ నాపిల్లవానితండ్రికిని సపిండజ్ఞాతులకును పదిదినములు పురుడుండును.

(౧) మగశిశువునుప్రసవించిన స్త్రీ ఇరువదియొకటవదినమునను ఆడుశిశువును ప్రసవించిన స్త్రీ ముప్పదియొకటవదినమునను శుద్ధినొందుట యాంధ్రాచారము.

అదుపిల్లపుట్టినయెడ నాపిల్లయొక్క సొంతఅన్నలకును సవతియన్నలకును వారికొడుకులకును తండ్రికిని పెదతండ్రిపినతండ్రులకును వారికుమారులకును తండ్రితండ్రికిని అతనిసోదరులకును పదిదినములు పురుడుండును.

(౫) కవలపిల్లలు కలిగినయెడ ఆపిల్లలతండ్రికి పండ్రెండుదినములు పురుడుండును

(౬) పురుడువచ్చినవారినందరిని నాలుగుదినములవరకును నితరులు ముట్టుకొనగూడదు.

సమానోదకజ్ఞాతులకు పుత్రజననముకలిగెనేని మూడు దినములు పురుడుండును.

సగోత్రజ్ఞాతులకు పుత్రజననముకలిగెనేని యొకదినము పురుడుండుట వృద్ధాచారము.

పుత్రికాజననముకలిగెనేని మూడుపురుషాంతరములుదాటిన జ్ఞాతులెవ్వరికిని పురుడులేదు.

---

(౫) కవలపిల్లలుకలిగినను తండ్రికి పదిదినములే పురుడుండుట యాంధ్రాచారము.

(౬) పురుడువచ్చినవారిని శిశువుపుట్టినవెంటనే చేయబడుస్నానముకంటె ముందుముట్టుకొనగూడకపోవుట యాంధ్రాచారము. అట్టిస్నానమైనపిమ్మట కర్మానర్హతారూపమైనజాతాశౌచమేగాని ఇతరులు ముట్టుకొనగూడకపోవుటయును నాశౌచగ్రంథములకక్కరలేదు.

స్త్రీ వివాహితురాలైనను తనతల్లిదండ్రుల గృహమందు ప్రసవించె నేని యా స్త్రీయొక్క తల్లిదండ్రులకు మూడుదినములు పురుడుండును. ఇతరగృహమందు ప్రసవించినయెడ లేదు. కొమార్తె ప్రసవించుటకై వియ్యాలవారిచే తల్లిదండ్రుల సొమ్ము కచ్చుగా పెట్టఁబడినప్పుడు, అన్యుల గృహమందు ప్రసవించినను ఆప్రసవించినయామె తల్లిదండ్రులకు మూడుదినములు పురుడుండును.

మేనమామ సోదరులు పెదతండ్రి పినతండ్రులు మొదలగు బంధువుల గృహమందు ప్రసవించెనేని వారికొకదినము పురుడుండును. ఇతరుల గృహములందు ప్రసవించినను మేనమామ మొదలగువారి సొమ్ము ఆప్రసవవిషయములో కచ్చుగా పెట్టఁబడినయెడ మేనమామ మొదలగువారి కొకదినము పురుడుండును.

బంధువులుకానివారి యిండ్లలో ప్రసవించినప్పుడు ఆయిండ్ల యజమానులకుగాని ఇండ్లకుగాని పురుడు లేదు.

(౧) క్షేత్రజుని పుట్టకయందు వానితల్లియొక్క పెండ్లిభర్తకును వానిని పుట్టించినవానికిని మూడుదినములు పురుడుండును. వారిజ్ఞాతులకు (అనగా తల్లిపెండ్లిభర్త పుట్టించినవాఁడును ఎవరో వారిజ్ఞాతులకనుట) ఒకదినము పురుడుండును.

ఐదవప్రకరణము ముగిసెను.

---

(౧) క్షేత్రజపుత్రవ్యవహారమే ప్రస్తుతము లేనందున నతనిపుట్టకయందు పైఁజెప్పిన రెండువిధములైన తండ్రులకును పురుడు పొత్తుగానే లేదు.

## ఆరవప్రకరణము.

## సపిండాదిమృతాశౌచము.

---

(౧) ఆడుపిల్లగాని మగపిల్లవాడుగాని పుట్టిన పదిదినములు దాటినపిమ్మట పండ్లుమొలచులోపలగాని చనిపోయెనేని తల్లిదండ్రులకును, ఒక్కతల్లికడుపునపుట్టిన సోదరులకును, సవతిసోదరులకును మైల పదిదినములుండును.

(౨) జ్ఞాతులకైతే ఆపిల్లగాని, పిల్లవాడుగాని ఖననము చేయబడినయెడ వెంటనే శుద్ధియగును. అనగా మైలలేదనుట. దహనము చేయబడినయెడ నొకదినము మైలయుండును.

(౩) పండ్లుమొలచుటకుగాని, ఆరవమాసమునకుగాని పిమ్మటనున్ను, మూడుసంవత్సరములకుగాని, పుట్టువెండ్రుకలు తీయుటకుగాని ముందుగానున్ను పిల్లలుచనిపోయిరేని

---

(౧) తల్లిదండ్రులకును సవతితల్లికిని సంస్కారమైనదిమొదలు మూడుదినములాశౌచముండుటయును అన్నదమ్ములకును సవతియన్నదమ్ములకును మైలలేకపోవుట యాంధ్రాచారము

(౨) జ్ఞాతులకు మయిలలేకపోవుటయు నాంధ్రాచారము

(౩) సంస్కారమైనదిమొదలు తల్లిదండ్రులకుమూడుదినములును, సొంతయన్నదమ్ములకును సవతియన్నదమ్ములకును వివాహముకాని సొంతయక్కచెల్లెండ్రకును వివాహముకానిసవతియక్కచెల్లెండ్రకును ఒక్కదినము మైలయుండుట యాంధ్రాచారము.

తల్లిదండ్రులకును, అన్నదమ్ములకును పదిదినములు మైల యుండును.

(౧౦) సపిండజ్ఞాతులకైతే. మగపిల్లవాని చావునందు ఖననము చేయబడిన పక్షమందొక దినమును, దహనము చేయుటగాని పారవేయుటగాని జరిగింపబడిన పక్షమందు మూడుదినములును మైలయుండును.

(౧౧) ఆడుపిల్ల మృతియందు ఖననము చేయబడినయెడ వెంటనే శుద్ధి. దహనముగాని పారవేయుటగాని జరిగింపబడిన పక్షమందు మూడుదినములు మైలయుండును.

(౧౨) ఉపనయనముకంటెగాని ఏడవ వత్సరముకంటె గాని ముందు బాలుడు చనిపోయినయెడ తల్లిదండ్రులకును

(౧౦) మగపిల్లవాడు చనిపోయినయెడ దహనఖననాదిభేదము లేక యే సపిండజ్ఞాతులకొక దినము మైలయుండుట యాంధ్రాచారము.

(౧౧) ఆడుపిల్ల చనిపోయినయెడ సపిండజ్ఞాతులకును దహనఖననాదిభేదము లేకయే సద్యశ్శుద్ధి అనగా మైల లేదనుట యాంధ్రాచారము-

(౧౨) ఉపనయనమైనను కాకపోయినను ఏడవ సంవత్సరము ప్రవేశించులోపల బాలుడు చనిపోయినయెడ తలిదండ్రులకు మూడుదినములు. పెంచుకొన్న తలిదండ్రులకును మూడుదినములు- ఈ రెండువిధములైన తలిదండ్రుల జ్ఞాతులకును మైల లేదు- ఆ చనిపోయిన బాలునియన్నదమ్ములకును సవతియన్నదమ్ములకును పెండిలికానియక్క చెల్లెండ్రకును మూడుదినములు మైల. ఇది యాంధ్రాచారము-

అన్నదమ్ములకును పదిదినములు మైలయుండును.

జ్ఞాతులకు మూడుదినములు మైలయుండును.

(౧౩) కన్యక చౌలమునకు అనగా పుట్టువెంట్రుకలు తీయుటకు పిమ్మటగాని మూడుసంవత్సరములు దాటిన పిమ్మటగాని వాగ్దానముచేయుటకుముందు (అనగా ఫలానా వానికీ పిల్లనిచ్చెదనని ఖరారుచేయుటకు ముందు) చని పోయినయెడ తల్లికిని తండ్రికిని సోదరులకును పదిదినములు మైలయుండును.

జ్ఞాతులకొకదినముమాత్రమే మైలయుండును.

(౧౪) వాగ్దానమునకు పిమ్మట వివాహమునకుముందు చనిపోయినయెడ తలిదండ్రులకును సోదరులకును పదిదినములు మైలయుండును.

జ్ఞాతులకు మూడుదినములు మైలయుండును.

ఈయవస్థయందే రజస్వలయై చనిపోయెనేని జ్ఞాతు

---

(౧౩) కన్యక చౌలమునకు పిమ్మటగాని మూడుసంవత్సరములు దాటిన పిమ్మటగాని వాగ్దానము చేయుటకు ముందు చనిపోయెనేని తలిదండ్రులకును సవతితల్లికిని అన్నదమ్ములకును [illegible]రమైనది మొదలు మూడుదినములు మైలయుండునని గ్రంథాంతరాచారము.

(౧౪) వాగ్దానమునకు పిమ్మట వివాహమునకుముందు చనిపోయినయెడ తలిదండ్రులకును సవతితల్లికిని అన్నదమ్ములకును మూడుదినములు మైలయుండునట గ్రంథాంతరాచారము

లకును పదిదినములే మైలయుండును.

(౧౫) వాగ్దానము జేయబడి వివాహము కాక ముందు రజస్వలయై కన్యక చనిపోయెనేని యా వాగ్దానమును పొందినవరునకును అతనిజ్ఞాతులకును మూడుదినములు మైల యుండును.

ఆకన్యక అట్టిభవిష్యద్భర్తయొక్క గోత్రమును చెప్పియే దహింపబడదగినది అనగా నట్టిభర్తయొక్క గోత్రమునుచెప్పియే సంకల్పాదికమును చెప్పి దహింపబడదగినదనుట.

(౧౬) వాగ్దానము చేయబడకపోయినను ఎనిమిదవసంవత్సరము ప్రవేశించినపిమ్మట కన్యక చనిపోయినయెడ జ్ఞా

---

(౧౫) వాగ్దానము చేయబడి వివాహము కాకముందు రజస్వలయై కన్యకచనిపోయెనేని యావాగ్దానమును పొందినవరునకును అతనిజ్ఞాతులకును మూడుదినములు మైలయుండునని యాంధ్రాచారము.

కాని పైనవివరించబడిన యాచారములు ద్రావిడులచేతనును ఆంధ్రులచేతనునుగూడ ప్రస్తుతము ఆచరింపబడుచుండుట లేదు.

(౧౬) ఈ[illegible]శౌచపూర్వకములకు లేదు అనగా చాలమునకుపిమ్మట [illegible]ని మూడుసంవత్సరములు దాటినపిమ్మట కాని ఎనిమిది సంవత్సరములైనను వాగ్దానముచేయబడనిదై రజస్వలకాకచనిపోయినయెడ పైనవిధి చెప్పబడినను కారణములు తెలియవచ్చుటలేదు [illegible] అన్యగోత్రులనును మూడుదినములును జ్ఞాతులకొకదినము మాత్రమే మైలయుండుట యాంధ్రాచారము.

తులకు మూడుదినములు మైలయుండును. తలిదండ్రులకును సోదరులకును పదిదినములుండును.

ఉపనయనమైనను కాకపోయినను గూడ నేడవవత్సరము ప్రవేశించిన పిమ్మట బాలుడు చనిపోయినేని తలిదండ్రులు సోదరులు మొదలుగాగల సపిండజ్ఞాతులందరికిని పదిదినములు మైల యుండును.

మహాగురువు చనిపోయినయెడ నే కుమారునకు పండ్రెండుదినములు మైలయుండును.

సమానోదకజ్ఞాతులలో నుపనయనము కానివాడు చనిపోయెనేని వెంటనేశుద్ధియగును ఉపనయనమయిన వాడు చనిపోయెనేని మూడుదినములు మైలయుండును.

సగోత్రజ్ఞాతులలో నుపనయనమైనవాడు చనిపోయెనేని యొకదినము మైలయుండును.

అసపిండజ్ఞాతులకు అనగా నేడుతరములు దాటినవారికి పెంపకమివ్వబడినవానికి తనజనకతల్లిదండ్రులమరణమందును మూడుదినములే మైలయుండును.

సపిండజ్ఞాతులకుగాని అసపిండజ్ఞాతులకుగాని పెంపకమివ్వబడినవానికి తనజనకతల్లిదండ్రులకు వేరేపుత్రాద్యనంతరకర్తలులేక వారియుత్తరక్రియలు తానుచేయవలసివచ్చెనేని పదిదినములు మైలయుండును.

జ్ఞాతికుటుంబసోదరునికి అనగా జనకతండ్రియొక్క మరియొకకుమారునికి అనంతరకర్తలు లేకపోయినను ఇటు వలెనేయని యెఱుంగునది.

(౧) వివాహమైనవానిని విడిచి యన్యుని భర్తగానాశ్రయించిన స్త్రీ చనిపోయెనేని దానివివాహభర్తకును జారభర్తకునుగూడ మూడుదినములు మైలయుండును. వివాహభర్త జ్ఞాతులకును జారభర్త జ్ఞాతులకునుగూడ నొకదినము మైల. వివాహభర్త చనిపోయినను జారభర్త చనిపోయినను నాస్త్రీకిగూడ మూడుదినములు మైల. వివాహభర్తగాని జారభర్తగాని తనయెదుటగాక నింకొక స్థలమందు చనిపోయినయెడ నాస్త్రీకిని అట్టిస్త్రీ తమయెదుటగాక నితరస్థలమందు చనిపోయినయెడ వివాహభర్త జారభర్తలకునుగూడ నొకదినము మాత్రమే మైల. తనకంటె తక్కువజాతిపురుషుని జారునిగా చేసికొనిన స్త్రీయును చాలమందిపురుషులను జారులనుగా చేసుకొనిన స్త్రీయును చనిపోయిరేని వారిపెండ్లిభర్తలకు మైల లేదు.

(౨) క్షేత్రజుడు చనిపోయినయెడ వానితల్లిపెండిలిభర్తకును, వానినిపుట్టించినవానికిన్ని మూడుదినములు మై

---

(౧) ఈవాక్యములలోని యాచారములు ప్రస్తుతమాచరణములో లేవు.

(౨) క్షేత్రజపుత్రవ్యవహారమే ప్రస్తుతములేనందున తన్మరణమందుపైనిచెప్పబడిన రెండువిధములైన తండ్రులకును అట్టితండ్రులమరణమందతనికి మైలయుండుట బొత్తుగానే లేదు.

లయుండును. వారియుభయుల జ్ఞాతులకును యొకదినము మైలయుండును. ఉపనయనము కాకముందు చనిపోయెనేని వారికి మైలలేదు. పైరెండువిధములైన తండ్రులును చనిపోయినప్పుడు క్షేత్రజాదులకు మూడుదినములు మైల యుండును.

(౧) షండుడు పాషండుడు పతితుడు వ్యర్థజాతుడు (౨) వ్యభిచరించిన స్త్రీ (అనగా నొకజారపురుషునే ఆశ్రయించినదానివిషయమై ఇదివరలో నాశౌచము విధించియున్నారు గనుక నిచట వ్యభిచరించినస్త్రీ యనగా ననేకపురుషులతో వ్యభిచరించిన స్త్రీ యనుట) స్త్రీఘ్ని యును అనాశ్రమి (అనగా ఆశ్రమహీనుడు అనగా నెవడైతే గృహస్థాశ్రమమునువిడిచి వానప్రస్థుడైనను సన్యాసియైనను కాకుండునో వాడును ఎవడైతే అవివాహితుడై యుండినను వివాహము చేసుకొనడో వాడుననుట) అనాశ్రమియును సన్యాసియును మృతినొందిరేని వారిసపిండసమానోదకసగోత్రబంధ్వాదులకు వెంటనే శుద్ధి అనగా మైలలేదనుట.

---

(౧) షండ పాషండ వ్యర్థజాత అనాశ్రమిలమరణమందు మైల పట్టుచునే యున్నారు.

పతితునిమరణమందు మైలపట్టుట లేదు.

(౨) వ్యభిచరించుస్త్రీ యనగా యిల్లువిడిచి కేవలముదేశముమీదికి పోయినదానిమరణమందుతప్ప తక్కినదానిమరణమందు మైల పట్టుచునే యున్నారు.

(౧౭)తమతమసపిండాదులమరణమందు బ్రహ్మచారుల కును సన్యాసులకును మైల లేదు

ఆరవప్రకరణము ముగిసెను.

---

(౧౭) బ్రహ్మచారులును స[illegible]సపిండాదులమరణమందు మైలపట్టుట గూంఢ్రాచారము-

## ఏడవ ప్రకరణము.

## ఆసగోత్రమృతాశౌచము.

---

తల్లియెదుటగాని తండ్రియెదుటగాని వివాహమైన కొమార్తె చనిపోయినయెడ వారికి మూడుదినములు మైలయుండును. వారియెదుటగాక నింకొకస్థలమందు చనిపోయినయెడ దినన్నర.

(౧౫) అటువలెనే తలిదండ్రులును వివాహమైనకొమార్తెయెదుట చనిపోయినయెడ నామెకును మూడుదినములు మైల యుండును. ఆమెయెదుటగాక నింకొకస్థలమందు చనిపోయినయెడ దినన్నర.

కుమార్తెకుమారుడు తమయెదుట చనిపోయినయెడ తల్లితండ్రికిని తల్లితల్లికిని మూడుదినములు మైల. తమయెదుటగాక నింకొకస్థలమందు చనిపోయినయెడ దినన్నర.

ఆ చనిపోయిన కుమార్తెకుమారుడుపనయనము కానివాడైతే దినన్నరయే మైలయుండును. ఉపనయనము కానివాడయినను ఏడవసంవత్సరము ప్రవేశించినవాడై చనిపోయెనేని మూడుదినములు మైల యుండును.

---

(౧౮) కుమార్తె తనయెదుటగాని ఇతరస్థలమందుగాని తనతల్లిగాని తండ్రిగాని చనిపోయినయెడ మూడుదినములు మైల పట్టుటయు పదిదినములు దాటినపిమ్మట సంవత్సరములోపల నట్టిచావుకబురువినినయెడ దినన్నర మైల పట్టుటయును ఆంధ్రాచారము.

ఉపనయనమైనవాడు మేనమామ అన్యగోత్రికులైన పినతల్లి పెత్తల్లులు వీరియెదుటచనిపోయెనేని వీరికిమూడు దినములుమైలయుండును – వీరియెదుటకాకుండా నింకొకస్థలమందు చనిపోయెనేని దినన్నరిమైల. ఉపనయనముకాని వాడు చనిపోయెనేని దినన్నరిమైల.

(౧౯) మేనమామ పినతల్లి పెత్తల్లి మేనమామభార్య వీరు ఎవనియెదుటచనిపోవుదురో వానికి మూడుదినముల మైలయుండును. తనయెదుటగాక నింకొకస్థలమందు చని పోయిరేని దినన్నరిమైలయుండును.

ఉపనయనముకాని మేనమామయును, వివాహము కానిపినతల్లియును తనయెదుటచనిపోయెనేని దినన్నరమైలయుండును. తనయెదుటగాక నింకొకస్థలమందుచనిపోయెనేని స్నానమాత్రమువలననే శుద్ధియగును.

తల్లితండ్రి తలితల్లి వీరుతనయెదుట చనిపోయిరేని మూడుదినములు మైలయుండును. తనయెదుటగాక నింకొకస్థలమందు చనిపోయిరేని దినన్నరమైలయుండును.

తనభార్యబ్రతికియుండగా నామెతల్లిగాని తండ్రిగాని

(౧౯) ఉపకారియగు మేనమామ తనయెదుటచనిపోయినను మరి యొకస్థలమందు చనిపోయినను మూడుదినములు మైలపట్టుట ఆచారము.

తనయెదుటచనిపోయినయెడ మూడుదినములు మైలయుండు ను- ఇంకొకస్థలమందు చనిపోయినయెడ దినన్నర మైల యుండును-

తనభార్యచనిపోయినపిమ్మట వారుచనిపోయిరేని ఒక దినముమైలయుండును- తనభార్యచనిపోయినను ఆమెయం దుగలిగిన సంతానమున్నయెడ అభార్యయొక్క తల్లితండ్రు లు తనయెదుటచనిపోయిరేని మూడుదినములును ఇతరస్థల మందుచనిపోయిరేని దినన్నరయును మైలయుండును

(౨౦)తనభార్యచనిపోయి ఆమెయందు సంతానముకూ డలేకుండ నున్నస్థితిలోగూడ భార్యయొక్క తల్లిదండ్రులు చనిపోయిరేని ఒకదినము మైలయుండును-

ఉపనయనము కాకముందు అన్యగోత్రికుకు పెంపక మివ్వబడినవాడు చనిపోయెనేని జనకతల్లిదండ్రులకు మూ డుదినములు మైలయుండును- జ్ఞాతులకొక్కదినముమాత్ర మే మైలయుండును-

ఉపనయనము కాకముందు అన్యగోత్రికులకు పెంపక మివ్వబడినవాడు దత్తకుటుంబముయొక్క పురుషమయిల నే పట్టవలయునుగాని జనకకుటుంబ సంబంధమయిన పురు షమయిలలను పట్టనక్కరలేదు-

---

(౨౦)భార్యయును పిల్లలును లేనిఅల్లునియెదుటఅత్తమామలుచనిపో యిరేని దినన్నరమైలపట్టుట యాంధ్రాచారము-

ఉపనయనమైనపిమ్మట అన్యగోత్రికులకు పెంపకమి య్యబడినవాడు జనకకుటుంబ దత్తతకుటుంబముల యొక్క పురుషు మైలలను పట్టవలయును. వానికి రెండు కుటుంబములయందు పుట్టినకన్యలనూ వివాహము చేయగూడదు.

మేనమామకొడుకులును కూతులును కొమార్తెకొమార్తె పినతల్లిపెత్తల్లుల యొక్క కొడుకులును కూతులును మేనత్తకొడుకులును కూతులును (౨౧) అక్కచెల్లెండ్రును వారి కొడుకులును కూతులును అన్నదమ్ముల కూతులును పినతండ్రి పెత్తండ్రుల కూతులును కొడుకుకూతురును పరిమరణమందు దినన్నరమైలయుండును.

ఈమైలయనునది వివాహమైన స్త్రీలయొక్కయును ఉపనయనమైన పురుషులయొక్కయును మరణమందేయని తెలియవలయును.

పైనవివరింపబడిన బంధుత్వములు కల స్త్రీలువివాహము కాకమునుపు పురుషులుపనయనము కాకమునుపును చనిపోయినయెడల పైనను దాహ[illegible]డినదినన్నరమైలగల వారికి స్నానమాత్రమువలననే శుద్ధియగును.

సవతితల్లియొక్కతల్లి, తండ్రి, సోదరుడు, సోదరి

(౨౧) అక్కచెల్లెండ్రును వారికొడుకులును తమయొక్క చనిపోయి నని మూడుదినములును ఇతరస్థలమందు చనిపోయిన దినన్నరయును మైలపట్టవలె యం[illegible]చారము.

కొమార్తె, సోదరీపుత్రిక, సోదరీపుత్రుడు, సోదరపు పుత్రుడు, సోదరపుత్రిక, కొమార్తెకొమారుడు, కొమార్తె కొమార్తె, వీరిమరణమందొకదినము మైలయుండును.

(౨౨)తల్లితండ్రి, తల్లితల్లి, మేనమామ, మేనమామకూతులు, మేనమామకొడుకులు. పినతల్లిపెత్తల్లులు, వారికొమాళ్లును కొమార్తెలును, కొమార్తెకొమార్తె, అక్కలు, చెల్లెండ్రు, వారికొడుకులును, కూతులును, అన్నలును, తమ్ములును, వారికొడుకులును, కూతులును, మేనత్త, ఆమెకొడుకులును, కూతులును, పినతండ్రిపెత్తండ్రులు, వారికొడుకులును, కూతులును, కొమారునికొమార్తె, తండ్రితండ్రి, తండ్రితల్లి, వీరుచనిపోయిరేని వివాహమైనస్త్రీకి పక్షిణీ యుండును.

ఈపక్షిణీయనునది వివాహమయినస్త్రీలయొక్కయును ఉపనయనమైన పురుషులయొక్కయును మరణమందేయని తెలియవలయును.

సవతికూతురుచనిపోయె నేని సవతితల్లికిని సవతితల్లి అమెతల్లి, తండ్రి, సోదరులు, సోదరీలు, కూతులు, సో

---

(౨౨)తల్లితండ్రి తల్లితల్లి మేనమామ పినతల్లి పెత్తల్లి అక్క చెల్లెలు అక్కకొడుకు చెల్లెలికొడుకు అన్న తమ్ముడు అన్నకొడుకు తమ్మునికొడుకు మేనత్త వీరు వివాహమైన స్త్రీకిమొదుట చనిపోయినని మూడుదినములును ఇతరస్థలమందుచనిపోయినని పక్షిణియునయుండుట ఆంధ్రాచారము

ధరీపుత్రిక, సోదరీపుత్రుడు, సోదరపుత్రిక, సోదరపుత్రుడు, కొమారెకొమారుడు, కొమారెకొమార్తె వీరియొక్క మరణమందు వివాహమైయుండని స్త్రీకి ఒకదినము మైలయుండును-

భార్యయొక్క సోదరుడు తనయెదుట చనిపోయెనేని ఒకదినము మైలయుండును- ఇతరస్థలమందు చనిపోయెనేని మైల లేదు-

(౨౩) అల్లుడును తోబుట్టువు పెనిమిటియును చనిపోయెనేని స్నానమాత్రమువలననే శుద్ధియగును-

(౨౪) ఎవరైనను బుద్ధిపూర్వకముగా నీటిలోబడుట విషముదినుట ఉరివేసుకొనుట మొదలగుపనులవలన చనిపోయిరేని వారివారికి మైల లేదు-

పదవప్రకరణము ముగిసెను.

---

(౨౩) అల్లుడును తోబుట్టువు పెనిమిటియును తనయెదుట చనిపోయినయెడ నొకదినము మైలపట్టుటయును ఇతరస్థలమందు చనిపోయినయెడ మైలపట్టకపోవుటయును నాంధ్రాచారము-

(౨౪) ఎవరైనను బుద్ధిపూర్వకముగ నీటిలోబడుట మొదలగుపనులవలన చనిపోయిరేని వారిచావునుగురించి వారిజ్ఞాతులు మొదలగువారు ఒకదినము మైలపట్టుటయాంధ్రాచారము-

కాని ద్రావిడులును నాంధ్రులునుగూడ నైప్రకారముగ చనిపోయినవారిమరణమందుగూడ ప్రస్తుతమందు మైలపట్టుచునేయున్నారు

## ఎనిమిదవప్రకరణము.

### అస్థిశాంతాశౌచము.



—పురిటివిషయము—

పరోక్షమందు అనగా తమయెదుటకాకుండ సంభవించినపురుడు పదిదినములమధ్య తెలియబడినయెడ నందరికిని ఆ తెలియబడినదినము మొదలు మిగిలినదినములే యుండును గాని పదిదినములుండదు.

పురిటి పదిదినములు దాటినపిమ్మట పురుడు తెలియబడెనేని ఎవ్వరునుపురుడు పట్టనక్కరలేదు పురుడు దాటినపిమ్మట తెలియబడినయెడ పుట్టినశిశువుయొక్క తండ్రికిగూడ స్నానమాత్రముననే శుద్ధియగును.

—మయిలవిషము—

యజ్ఞములను చేసినవారుగాని చేయనివారుగాని చనిపోయినప్పుడు మంత్రపూర్వకముగా దహనాదులు చేయబడక తిరుగాదశాహామధ్యమందు దహనసంస్కారము చేయబడినయెడ మిగిలియున్నదినములే మయిలగాని పిమ్మట చేయబడిన దహనసంస్కారదినము మొదలుపదిదినములు మయిలయుండదు.

యజ్ఞములుచేసినవారికి దశాహాస్సుదాటిన తరువాత తిరుగా దహనముచేయబడినపక్షమందు అపునర్దహానదిన

ము మొదలు పదిదినములు జ్ఞాతులకుమయిలయుండును.

యజ్ఞములను చేయనివారికి దశాహస్సు దాటినతరువాత అస్థిదహనము చేయబడినయెడ జ్ఞాతులు మొదట మయిలపట్టినట్లయితే ఆయస్థిదహనదినము మొదలు పదిదినములు మయిలపట్టవలయును. మొదటమయిలపట్టి ఉదకదానమును చేయకపోయినయెడ మూడుదినములుమయిలపట్టవలయును. మొదటమయిలపట్టి ఉదకదానమునుకూడ చేసినతిరుగ మయిలపట్టనక్కరలేదు.

ప్రతికృతిదాహమందు మొదటమయిలపట్టనియెడమూడుదినములుమయిలపట్టవలయును. మయిలపట్టిఉదకదానము చేయకపోయినయెడ ఉదకదానసంబంధమయిన మయిల మూడుదినములుండును. మయిలపట్టుటయునుఉదకదానమును కూడ జరుపబడినట్లయితే జ్ఞాతులకుమయిలలేదు.

కొడుకులకైతే అస్థిదాహమందున్ను ప్రతికృతిదాహమందున్ను గూడ మొదటమయిల పట్టబడినను పట్టబడకపోయినను గూడ మయిలపదిదినములుండును.

పరోక్షమందుఅనగా తమయెదుటకాకుండా సంభవించిన మైలపదిదినములమధ్య తెలియబడినయెడనందరికిని ఆతెలియబడిన దినము మొదలు మిగిలినదినములేయుండును గాని పదిదినములునుండదు.

కౌమారునకు పదిదినములమధ్యమందు సంచయనముకం టెముందుగా తల్లియొక్కగాని తండ్రియొక్కగాని చావు కబురువినవచ్చినయెడ మిగిలినదినములే మైలయుండునుగా ని వినవచ్చినదినము మొదలు పదిదినములునుండదు.

సంచయనమయినపిమ్మట యేదినమునందైననుతల్లియొ క్కగాని తండ్రియొక్కగాని చావుకబురు తెలియబడినయె డ నాదినము మొదలు పదిదినములుమైలయుండును.

తనయెదుటకాకుండా యెక్కడనైనను సవతితల్లిచని పోయినవార్త సంవత్సరములోపల తెలియబడెనేని కన్న తల్లిమరణమందువలెనే పదిదినములుమైలయుండును.

సంవత్సరము దాటినపిమ్మట తెలియబడినేని ఉత్తర క్రియలు మరియెవ్వరిచేతనైన చేయబడెనేనిఒకదినముమా త్రమే మైలయుండును.

ఉత్తరక్రియలు *చేయబడనియెడ సొంతతల్లిమృతియం దువలెనే పదిదినములును మైలయుండును.

ఉత్తరక్రియలుచేయబడినతరువాత సంవత్సరముదా టినపిమ్మట తల్లియొక్కగాని తండ్రియొక్కగాని మరణ వార్త తెలియబడినయెడ పెద్దకుమారునికంటె నితరకుమా రులకు మూడుదినములేమైలయుండును.

(౨౫)అతిక్రాంతమయిన పదిదినములమైల మూడుమాసములలోపల తెలియబడెనేని సపిండజ్ఞాతులకు మూడుదినములేమైల యుండును. మూడుమాసములుదాటి ఆరుమాసములుదాటకుండ తెలియబడినయెడ పక్షిణియేయుండును. ఆరుమాసములుదాటి పండ్రెండుమాసములుదాటకుండ తెలియబడినయెడ నొకదినమే యుండును. పండ్రెండుమాసములుదాటినతరువాత తెలియబడెనేని స్నానమాత్రము వలననే శుద్ధియగును. ఈయతిక్రాంతాశౌచము ఉత్తరక్రియలు చేయబడినవారివిషయమే అయియున్నది.

ఉత్తరక్రియలు చేయబడనివారి విషయములోనైతే యజ్వాయజ్వులయొక్క పునర్దహనవిషయములో వెనుక చెప్పబడినప్రకారమే అయియున్నది.

అతిక్రాంతమైన మూడుదినములమైల మరణాదినము మొదలు పదిదినములలోపల తెలియబడెనేని ఒకదినముండును.

అతిక్రాంతమైన పక్షిణి పదిదినములలో తెలియబడెనేని ఏకకాలము (అనగా రాత్రియందు తెలియబడితే ఆ రాత్రిమట్టుకే యుండుటయు పగటియందు తెలియబడితే ఆపగటిమట్టుకే యుండుటయు).

---

(౨౯)మాతాపితృవిషయములకంటె వేరైన యీయతిక్రాంతాశౌచము పదిదినములైనపిమ్మట తెలియబడినయెడ నాంధ్రులకు లేదు.

మూడుదినములమైలయును పక్షిణీమైలయును పదిదినములు దాటినతరువాత తెలియబడినయెడ స్నానమాత్రమువలననే శుద్ధియగును.

అతిక్రాంతమైనఒకదినపుమైల పదిదినములలోపల తెలియబడినను స్నానమాత్రముననే శుద్ధియగును.

ఉపనయనముకానివాడు చనిపోయినపుడు తల్లి, తండ్రి, సోదరులు, వీరికంటె వేరైన జ్ఞాతులకు అతిక్రాంతాశౌచముండదు.

ఉపనయనము కానివాడయినను ఏడవసంవత్సరముప్రవేశించినతరువాత చనిపోయెనేని తల్లి,తండ్రి, సోదరులు వీరికివలెనే జ్ఞాతులకును అతిక్రాంతాశౌచము ''త్రిరాత్రం త్రిషు మాసేషు'' అను నిత్యాది శాస్త్రోక్తప్రకారముగా పదిదినములు దాటినపిమ్మట మూడుమాసములలోపల తెలియబడెనేని మూడుదినములును మూడుమాసములు దాటినపిమ్మట నారుమాసములలోపల తెలియబడెనేనదినన్నరయును ఆరుమాసములు దాటినపిమ్మట సంవత్సరములోపల తెలియబడెనేని ఒకదినమును ఉండును సంవత్సరము దాటినపిమ్మట తెలియబడెనేని స్నానమాత్రముననే శుద్ధియగును.

తనపరోక్షమందు చనిపోయినట్టియు చేయబడినయుత్తరక్రియలుకలిగినట్టియు సోదరునియొక్క మరణవార్త అతడుమరణమొందిన ఆరుమాసములలోపున వినవచ్చెనేని

యుతేనసోదరునికి మూఁడుదినములు మైల. ఏడవమాసమ
దలు సంవత్సరములోపున వినవచ్చెనేని దినన్నర.
క్రియలు చేయబడని సోదరునకారుమాసములలోపున
గా నస్థిప్రతికృతిదహనాదులు చేయబడెనేనియతనిసో
రునకు పదిదినములు మైల. ఆరుమాసములపిమ్మట సం
ములోపల నస్థిప్రతికృతిదహనాదులు చేయబడెనేని
డుదినములు. ఈవిషయములో సోదరునిదహనము చేసిన
సోదరునకు పదిదినములు మైలయనివిశేషము. చేయబడి,
యుత్తరక్రియలుగల సోదరునిమరణవార్త సంవత్సరము
దాటినపిమ్మటవినవచ్చెనేని సోదరునకొకదినము మైల. సం
వత్సరముదాటినపిమ్మట తిరుగా నస్థిప్రతికృతిదహనాదులు
చేయబడెనేని మొదటదహించిన సోదరునికి మూఁడుదిన
ములు మైల. దహించనివానికొకదినము మైల.

ఒకమైలవచ్చియుండగా దంపతులలో భర్తగానిపో
యినయెడ భార్యకును భార్యగానిపోయినయెడ భర్తకును (త
మదంపతిసంబంధి) వారివారిమరణదినము మొదలు పదిదిన
ములువెళ్ళిన పిమ్మట శుద్ధిగాని మొదటిమైలయొక్క శేష
ముచేత శుద్ధికాదు.

చేయబడినయుత్తరక్రియలుగల భర్తయొక్క పరో
క్షమరణవార్త సంవత్సరములోపల భార్యవినినను అట్టిభా
ర్యమరణవార్త భర్తవినినను పదిదినములు మైల. సంవత్సర
ముదాటినపిమ్మట వినినయెడమూఁడుదినములు భర్తకుగాని

డు శిశువుచనిపోయెనేని అశిశువుయొక్క తల్లిదండ్రులకు ను సపిండజ్ఞాతులకును పురిటిదినముల శేషములోనే అనగా నాశిశువు చనిపోవునప్పటికి మిగిలియున్న పురిటిదినముల తోనేశుద్ధియగును- అనగా శిశువుయొక్క మరణమునుగు రించి తిరుగఃనిదినములును మయిలపట్టవలెనక్కర లేదనుట-

(౨౬)పురిటియొక్క ఆఖరుదినమందు శిశువుచనిపో యెనేని యాశిశువుయొక్క తండ్రికిమాత్రము తిరుగరెం డుదినములుమయిలయుండును అనగా పురిటియొక్క శేష దినముగాక మరిరెండుదినములనుట-

(౨౭) పురిటికొసదినమురాత్రి కొసజాముననగాని అరు ణోదయవేళయందుగాని శిశువుచనిపోయెనేని తిరుగమూ డుదినములు మయిలయుండును-

పదిదినములుదాటని శిశువుయొక్కమరణమువలన వ చ్చినమయిల వినాగా తక్కినయేమయిలయును పురిటియొ క్క శేషముచేతపోదు-

---

(౨౮)పురిటికొసదినమురాత్రి కొసజామునగాని అరుణోదయవే ళయందుగాని పిల్ల చనిపోయెనేని ఖననదినముమొదలు మూడుదిన ములు తల్లిదండ్రులు మైలపట్టుట యాంధ్రాచారము.

(౨౭)పురిటియొక్క పదియవదినమందు పిల్లచనిపోయెనేని యా పిల్లను ఖననముచేసినదినముమొదలు తల్లిదండ్రులకు రెండుదినములా శౌచముండుట యాంధ్రాచారము.

మొదటవచ్చినపురుడు యుంటుండగా యెవరైనను యెవనినైనను. తానుదహించదగినజ్ఞాతినొకనిని దహించి నయెడ నాదహానదినము మొదలు పదిదినములు వెళ్ళినపిమ్మట నాదహించినవానికి శుద్ధిగాని మొదటవచ్చినపురుడుయొక్క శేషము వెళ్లినపిమ్మటకాదు.

—మయిలలోపురుడు—

మయిలయుండగా దానితోసమానపరిమాణముగల యింకొకపురుడువచ్చినయెడ దానికిని మొదటిమయిలశేషముతోనేనివృత్తియగును.

మొదటవచ్చినమయిలకంటె తరువాతవచ్చినపురుడు అధికపరిమాణముగలదైనయెడ మొదటిదానిశేషముచేత పోక తనకు నిర్ణయింపబడిన కాలపరిమితిచేతనే పోవును.

మయిలమధ్యమంటు తనకు కొడుకుగాని కూతురుగాని పుట్టినయెడ నాశిశువునుకనిన తల్లిదండ్రులలో—

తల్లికి ఇదివరలో విథింపబడినప్రకారము మగశిశువును కనినట్లుఅయితే ముప్పదిదినములును ఆడుశిశువునుకనినట్లుఅయితే నలువదిదినములును పురుడుండును.

తండ్రికి శిశువుపుట్టిన దినము మొదలు పదిదినములును పురుడుండును.

ఇద్దరికిని పూర్వపుమైలశేషముచేతనే శుద్ధికాదు.

—మైలలోమైల—

మైలయుండగా దానితోసమానపరిమాణముగలయింకొకమైలవచ్చినయెడ దానికి మొదటిమైలశేషముతోనే యాశౌచము పోవును.

మొదటవచ్చినమైలకంటె తరువాతవచ్చినమైల యధికపరిమాణముగలదైనయెడ మొదటిదానిశేషముచేతపోక తనకునిర్ణయింపబడిన కాలపరిమితిచేతనే పోవును.

మైలయొక్క పదియవదినమందు మరియొకమైల వచ్చినయెడ నావచ్చినదానికి మొదటిదానిపదిదినములశేషముచేతగాక మరిరెండుదినములచేత నివృత్తియగును.

పదియవదినముయొక్క రాత్రిశేషజామునగాని అరుణోదయవేళయందుగాని వచ్చినయెడ మొదటిదానిశేషముచేతగాక మరిమూడుదినములచేత నివృత్తియగును.

పదియవదినము శేషజామునగాని అరుణోదయవేళయందుగాని వచ్చినమైల మొదటవచ్చినదానికంటె కొంచెముపరిమాణముకలదైనయెడ మొదటిదాని శేషముచేతనే రెండవదానికిని నివృత్తియగును.

జ్ఞాతిమరణాశౌచమధ్యమందు తల్లిగానితండ్రిగాని మృతినొందెనేని యాతల్లియొక్కగాని తండ్రియొక్కగాని

మరణదినమునుంచి యారంభించియే పదిదినములు వెళ్లినపి మ్మట శుద్ధిగాని జ్ఞాతిమరణాశౌచశేషము చేతశుద్ధి కాదు-

జ్ఞాతిమరణాశౌచమందు భర్తచనిపోయె నేని భార్య కును భార్యచనిపోయె నేని భర్తకును వారివారిమరణదిన ము మొదలు పదిదినములపిమ్మట నే శుద్ధిగాని పూర్వాశౌచ శేషము చేత శుద్ధి కాదు-

తల్లిమరణమువలనవచ్చిన మైలమధ్యమందు తండ్రిచ నిపోయె నేని తండ్రిమరణదినమునుంచి యారంభించియేప దిదినములైనపిమ్మట శుద్ధిగాని తల్లిమరణమువలన వచ్చిన యాశౌచముయొక్క శేషము చేత శుద్ధి కాదు-

తండ్రిమరణమువలనవచ్చిన యాశౌచమధ్యమందు త ల్లిచనిపోయె నేని తండ్రిమరణపుమైలను సమాప్తినొందించి పిమ్మట పక్షిణీపట్టవలయునుగాని దశాహాశౌచమును పట్టన క్కరలేదు-

తండ్రిచనిపోవుటకు పూర్వదినమందుగాని తండ్రిచని పోయిన మరుచటిదినమందుగాని తల్లిచనిపోయినను-తల్లి తనభర్తకళేబరముతో గూడ నగ్నిప్రవేశముచేసి చనిపో యినను-తండ్రిచనిపోయినదినముననే కాలవశమున తల్లి చనిపోయినను-తండ్రియొక్క మరణమువలనవచ్చిన మైల యొక్క శుద్ధి చేత నే శుద్ధియగును గాన వేరుగా తల్లివిష

యుక్తమైన యాపత్తినీయును పట్టనక్కఱ లేదు.

మొదటవచ్చిన మైలయుండగా ఎవడైనను ఎవనినైన తాను దహింపదగినజ్ఞాతినొకనిని దహించినయెడ నాదహనదినము మొదలు పదిదినములు వెళ్లినపిమ్మట నాదహించినవానికి శుద్ధిగాని మొదటవచ్చినమైలయొక్క శేషము వెళ్లినపిమ్మట కాదు.

ఎవడైనను మొదటఎవనినైనతాను దహింపదగినజ్ఞాతినొకనిని దహించి యాయాశౌచమధ్యమందు అనగా మొదటివానిని దహించినందువలనవచ్చిన యాశౌచమధ్యమందు తిరుగ జ్ఞాతివానినిమరియొకనినిగాని ఇద్దరినిగాని యనేకులనుగాని దహించినను మొదటివానిని దహించిన మైలశేషముచేతనే శుద్ధినొందునుగానిపిమ్మటిదహనముల వలనవచ్చు మైలలను పట్టనక్కఱ లేదు.

ఒకనిని దహింపగావచ్చినమైలమధ్యమందు తల్లినిగాని తండ్రినిగాని ఇద్దరినిగాని దహించినయెడ వారిదహనదినము మొదలు అనగా తల్లిదండ్రులదహనదినము మొదలు పది దినములు అయినపిమ్మట శుద్ధిగాని పూర్వపుమైలయొక్క శేషముచేత శుద్ధి కాదు.

తాష్మికప్రకరణము ముగిసెను.

---

## పదవప్రకరణము.

## అసగోత్రవిశేషాశౌచము.

ఎవనిగృహమందు శ్రోత్రియుడు చనిపోవునో ఆగృహయజమానునకు మూడుదినములు మైలయుండును.

శ్రోత్రియుడు కానివాడు చనిపోయెనేని యొకదినము మైలయుండును.

(౧) ఏగ్రామమందు శ్రోత్రియుడు చనిపోవునో ఆగ్రామమునకొకదినము మైలయుండును.

శ్రోత్రియుడు కానివాడు చనిపోయినయెడ గ్రామమునకు మైలలేదు.

సబ్రహ్మచారియును తనదేశపురాజును చనిపోయితేని యొకదినము మైలయుండును.

తనదేశపురాజు తనయెదుట చనిపోయినయెడ నొకదినము మైలగాని ఇతరస్థలమందు చనిపోయినయెడ నేకకాలమే.

ఆచార్యుడు ఆచార్యభార్య శిష్యుడు ఋత్విజుడు యాజ్యుడువీరు చనిపోయిరేని మూడుదినములు మైలయుండును.

పదవప్రకరణము ముగిసెను.

---

(౧) ఏగ్రామమందు శ్రోత్రియుడు చనిపోవునో ఆగ్రామమునకొకదినము మైలయుండుట ప్రస్తుతకాలమందు ఆచరించుచుండుట లేదు

## పదకొండవప్రకరణము.

## క్షత్రియ-వైశ్య-శూద్రాశౌచనిర్ణయము.

---

శ్లో॥ జన్మహాన్యోస్తు వర్ణానాం దశ షోడశ వింశతిః।
త్రింశన్నిశాః క్రమేణాఘమిత్యనేకఋషిసమ్మతం॥

ఇందుకర్థమేమనగా వర్ణానాం=బ్రాహ్మణక్షత్రియవైశ్య శూద్రవర్ణములవారికి జన్మహాన్యోస్తు=పుట్టుకచావు ఇవిసంభవించెనేని క్రమేణ=క్రమముగా దశ=బ్రాహ్మణులకుపది దినములును షోడశ=క్షత్రియులకు పదునారుదినములును వింశతిః=వైశ్యులకిరువదిదినములును త్రింశన్నిశాః=శూద్రులకు ముప్పదిదినములును అఘం=ఆశౌచము అనగా జాతాశౌచమృతాశౌచములుండును ఇతి=ఈలాగున అనగా నీయంశము అనేకఋషిసమ్మతం=బహుఋషిసమ్మతమని ఆశౌచశతకము పదునెనిమిదవశ్లోకమున చెప్పబడినది.

ఇదేప్రకారముగ హారీతస్మృతిలో

శ్లో॥ బ్రాహ్మణే దశరాత్రం స్యాత్ క్షత్రియే షోడశస్మృతాః।
వైశ్యే వింశతిరాత్రం స్యాన్మాసం శూద్రే విశుద్ధయే॥

అనియును ఈప్రకారముగనే పైఠీనసివాక్యగ్రంథములో

ఆశౌచమనుక్రమిష్యామో బ్రాహ్మణస్య దశరాత్రం షోడశరాత్రం క్షత్రియస్య వింశతిరాత్రం వైశ్యస్య మాసం శూద్రస్య।

అనియును విధింపబడియున్నది.

కాని మనుస్మృతి పంచమాధ్యాయములో నెనుబది మూడవశ్లోకములో

శ్లో॥ శుధ్యేద్విప్రో దశాహేన ద్వాదశాహేన భూమిపః॥
వైశ్యః పంచదశాహేన శూద్రో మాసేన శుద్ధ్యతి॥

అనగా బ్రాహ్మణుడు పదిదినములచేతనును క్షత్రియుడు పండ్రెండుదినములచేతనును వైశ్యుడు పదునేనుదినముల చేతనును శూద్రుడు మాసముదినములచేతనును శుద్ధనొందునని చెప్పబడియున్నది.

కాని మనుస్మృతివాక్యానుసారముగ ఆంధ్రదేశమునందుండు గౌరకోమటులను వైశ్యులుమాత్రము సపిండాశౌచమును పదునేనుదినములు పట్టుచున్నారు- సమానోదక సగోత్ర అసగోత్రాశౌచములాంధ్రబ్రాహ్మణులరీతినే పట్టుచున్నారు- ఆంధ్రవైశ్యులలో కేవలము శ్రీవైష్ణవమతావలంబులైన త్రైవర్ణికులనువారును ఆంధ్రక్షత్రియులును సర్వాశౌచములును నాంధ్రబ్రాహ్మణులరీతినే పట్టుచున్నారు.

శూద్రులకు సర్వస్మృతులలోనును మాసముదినములు జ్ఞాత్యాశౌచము విధింపబడినను వెలమదొరలు కమ్మవారు తెలగాలు తెలుకుల్లు మొదలగువారాంధ్రబ్రాహ్మణులరీతినే సర్వాశౌచములను పట్టుచున్నారు- గొల్లకాపులు చాకలులు మంగళ్లు మొదలగువారు మంచినక్షత్రమును చూచి చనిపోయినవారికి వెంటనేగాని మూడునాలుగైదు

దినములలోగాని శ్రాద్ధమును జేసి యాశౌచమును విడుచు చున్నారు అనగా శుద్ధినొందుచున్నారు.

శూద్రాణాంతు సధర్మాణస్సర్వేపధ్వస్త్రజాస్స్మృతాః॥

అనియెడుమనువచనమును పట్టి అపధ్వస్త్రజులనబడు వర్ణసంకరులకు శూద్రులకువలెనే యాశౌచము విధింపబడినది.

ఈశూద్రులలోనే విష్ణుభక్తులగువారికి

మాసార్ధం వైష్ణవే శూద్రే దాసదాస్యోశ్చ శార్ఙ్గిణః॥

అని యాశౌచశతకమందును

శ్లో॥ చక్రాంకితాశ్చ యే శూద్రా మన్త్రభాజా మత్పరాయణాః।
తేషాం విప్రస్య దాసానామాశౌచం బాధనాపకం॥

అని విష్ణుధర్మోత్తరమందును విష్ణుమతస్థులై యాసంస్కారములనుపొందిన శూద్రులకు పదియేనుదినములాశౌచము విధింపబడియున్నది.

ఇట్లు శూద్రులకాశౌచము విధింపబడినను

శ్లో॥ దాసీదాసస్సపామాత్యకారకశ్శిల్పినోభిషక్।
స్వస్వకృత్యే సదాశుద్ధాశ్శుద్ధా నైవాన్యకర్మసు॥

అని యాశౌచశతకములోని యెనుబదిమూడవశ్లోకమునచెప్పబడియున్నది. ఇందుకర్థమేమనగా దాసీలును నౌకరులును ప్రజాపాలకులగు ప్రభువులును మంత్రులును చాకలులు మంగలులు మొదలగువాండ్రును బంగారువెండిమొ

దలగు లోహపుపనులును కర్రపనులును రాతిపనులును తోలుపనులును రంగులు వేయుటయును చేయువాండ్రు శిల్పులనబడుదురు గనుక వారును వైద్యులును వారువారు చేయతగినపనులయందు వారెప్పుడును శుద్ధులు గనుక వారికాశౌచమువచ్చినను వారితరులయిండ్లకువచ్చి వారివారి పనులు చేయవచ్చుననియును అట్లు వారిచేత పనులుచేయించుకొనుటవలన నితరులకు వారియాశౌచప్రయుక్తమైన యశుద్ధి రాదనియును తాత్పర్యము శుద్ధానైవాన్యకర్మసు అను చతుర్థపాదములో పఠింపబడిన యంశమేమనగా అన్యకర్మసు=వారికి విధింపబడిన కార్యములుగాక నితరకార్యములయందు నైవశుద్ధాః=శుద్ధులు కారు అని తాత్పర్యము

ఆయాశౌచశతకములోనే దానిపిమ్మటిశ్లోకములోనే

న విశేద్దేవతాగారం న కుర్యాద్వందనాద్యఘీ।

అఘీ=అనగా నాశౌచముకలవాడు దేవతాగారం=దేవాలయమును న విశేత్=ప్రవేశింపకూడదు వందనాదు=నమస్కారము మొదలగుదానిని నకుర్యాత్=చేయగూడదు ఇక్కడవందనాది అను నాదిశబ్దముచేత పుష్పాహరణపూజోపకరణస్పర్శాది గృహ్యతే అని వ్యాఖ్యానములో చెప్పబడియుండుటచేత దేవపూజకొరకైనపుష్పములను తెచ్చుటయును దేవపూజోపకరణములైన ఉదకచందనపాత్రాదులను ముట్టుకొనుటయును కూడదని తాత్పర్యము.

ఈ పైయంశములనుబట్టి బాగుగా నాలోచించగా వైష్ణవసంస్కారములు లేని దాసీదాసనృపామాత్యాదులైన శూద్రులు వారివారి వృద్ధాచారప్రకారముగ కొంచెము రోజులలోనే యుత్తరక్రియలు చేసి శుద్ధి పొందితిమనుకొన్నను సకలశాస్త్రసమ్మతమైన ముప్పదిదినములయాశౌచముకొరకును వైష్ణవసంస్కారవిశిష్టులైన శూద్రులు పదియేను దినములకొరకును దేవాలయప్రవేశాదులను వర్జించవలయునని ఫలితము తేలుచున్నది.

ఇట్లనే క్షత్రియులు పదునారుదినముల కొరకును వైశ్యులిరువదిదినములకొరకును దేవాలయప్రవేశాదులను వర్జించవలయును

ఆశౌచాంతమందు బ్రాహ్మణుడును క్షత్రియుడును వైశ్యుడును శూద్రుడును సంగవకాలమందు అనగా పగటి ప్రమాణమును అయిదుభాగములు చేసి అందులో రెండవభాగమందు స్నానము చేసి బ్రాహ్మణక్షత్రియవైశ్యులు నూతనయజ్ఞోపవీతధారణము చేసి బ్రాహ్మణుడుదకమును క్షత్రియుడశ్వగజరథాదివాహనములను వైశ్యుడు కొరడానుగాని త్రాటినిగాని ముట్టుకొనవలయును. శూద్రుడు చేతికఱ్ఱను ముట్టుకొనవలయును. ఇట్లు చేసినచో శుద్ధులగుదురు.

ఆ॥ వె॥ ఇట్లు చెప్పఁబడిన యయ్యర్థములయందు।

సంశయింపదగదు సరసుల్కకును।
సంశయించి రేని సాకులౌ ధర్మశా।
స్త్రముల దృష్టిదీర నడువవలయు॥

ఆ। వె॥ మూలవిధుల విడిచి ముఖ్యమౌ నొక।
యర్థమునును నిశ్చయింప మొనయనైతి।
గాన తెలియనిచ్ఛగలిగిన ఘనులెల్ల।
గానగదగును దీనగొంకు లేక॥

గద్యము.
ఇది వేదాంతవిజయధ్వజనామకవంశబిరుదశోభిత కౌశిక
గోత్రపవిత్ర వింజమూరిరామానుజాచార్యపౌత్ర శ్రీని
వాసాచార్యమంగాంబాపుత్ర వేంకటనృసింహాచా
ర్యేంద్రకృతంబగు నఘువివేచనంబను నాశౌ
చసర్వస్వము సంపూర్ణము.



ఓంతత్సద్బ్రహ్మార్పణమస్తు.

